రాధాస్వామి దయాళ్ కీ దయా రాధాస్వామి సహాయ్

# మనసా శతకము

## లేక

## మానస సరోవరము

(లఘుటీకతో సహా)

రచన :


'కవితాభారతి' సిద్ధేశ్వరం కొల్లప్పకవి

సత్సంగి

D. No. 17/1075-D3

శ్రీ సరస్వతీ విద్యామందిరము దగ్గర,

గుంతకల్లు-515 801.

స్వస్థలము

టి. వీరాపురము గ్రామము

రాయదుర్గము తాలూక

అనంతపురం జిల్లా,



ప్రచురణ :

రాధాస్వామి సత్సంగము,

గుంతకల్లు - 515 801.

2000.

# మనసా శతకము



ప్రథమ ముద్రణ : 2000 సం॥
(ప్రమాధినామ సంవత్సర ఫాల్గుణమాసము)

ప్రతులు : 1,000

ప్రచురణ సంఖ్య : 4

**వెల రూ. 5/-**

ప్రతులకు :
S. లక్ష్మీదేవి
W/o S. కొల్లప్ప
D. No. 17/1075-D3
శ్రీ సరస్వతీ విద్యామందిరము దగ్గర
గుంతకల్లు-515 801.

మరియు

**శ్రీ భారతీ సాహితీ సమితి (రి), గుంతకల్లు.**

ముద్రణ :
శ్రీ గాయత్రి ప్రింటర్స్,
గుంతకల్లు.

ರಾಧಾಸ್ವಾಮಿ ದಯಾಲಕೀ ದಯಾ! ರಾಧಾಸ್ವಾಮಿ ಸಹಾಯ!

Sadguru Dr. M.B. Vasudevachari, M.V.Sc,Ph.D.,
**Sawan Durbar Ashram,**
KENGERI, Bangalore-60

## — ಪ್ರೇರಣೆ —

"ಮನಸ್ಸೇ ಬಂಧ ಮತ್ತು ಮೋಕ್ಷಕ್ಕೆ ಕಾರಣ" ಎಂದು ನಮ್ಮ ಪೂಜ್ಯ ಸದ್ಗುರುಗಳು ತಿಳಿಸುತ್ತಿದ್ದರು ಮನಸ್ಸು ಇಂದ್ರಿಯವಾಸನೆಗಳಿಗೆ ಒಳಗಾಗಿ, ಹೊರಮುಖವಾಗಿ ಚಲಾಯಮಾನವಾದದ್ದೇ ಬಂಧನ. ಮತ್ತು ಅಂತರ್ಮುಖವಾಗಿ ಚೇತನ ಶಬ್ದದೊಂದಿಗೆ ಸ್ಥಿರವಾಗಿ ಕೂಡುವುದೆ ಮುಕ್ತಿ.

ಮಹಾಚಂಚಲವಾದ ಈ ಮನಸ್ಸನ್ನು ಸ್ಥಿರ ಪಡಿಸುವುದು ಸುಲಭಸಾಧ್ಯವಾದ ವಿಷಯವಲ್ಲ. ಈ ಮನಸ್ಸು ಮದೋನ್ಮತ್ತನಾದ ಆನೆ ಇದ್ದಂತೆ, ಯಾರ ಹತೋಟಿಗೂ ಸಿಗಲಾರದೆ ಸಂಸಾರವೆಂಬ ಮಾಯಾಮೋಹರೂಪವಾದ ವನದಲ್ಲಿ ಹುಚ್ಚಾಗಿ ಅಡ್ಡಾಡುತ್ತಿರುತ್ತದೆ. ಎಂತೆಂತಹ ಋಷಿ, ಮುನಿ, ಜಪಿ, ಯೋಗಿ, ಸನ್ಯಾಸಿಗಳೇ ಅಲ್ಲದೇ ದೇವಿ, ದೇವತಾದಿಗಳು ಸಹ ಮನಸ್ಸಿಗೆ ಕಡಿವಾಣ ಹಾಕಲಾರದೇ ಸೋತುಹೋದರು. ಈ ನಮ್ಮ ಮನಸ್ಸು ಯಾವತ್ತೂ ಒಂದು ರುಚಿ ಪದಾರ್ಥದಿಂದ ಮತ್ತೊಂದು ರುಚಿಯಲ್ಲಿ ಆಸಕ್ತವಾಗಿ ಹರಿದಾಡುತ್ತಿರುತ್ತದೆ. ಇಂತಹ ಚಂಚಲ ಮನಸ್ಸನ್ನು ಸ್ಥಿರಪಡಿಸಲು ಸಂತಮಹಾತ್ಮರು ನಮಗೊಂದು ಸುಲಭ ಉಪಾಯವನ್ನು ತಿಳಿಸುತ್ತಾರೆ. ಈ ರುಚಿಯನ್ನು ಬಯಸುವ ಮನಸ್ಸಿಗೆ ಎಲ್ಲದಕ್ಕಿಂತ ಮಿಗಿಲಾದ ಅತ್ಯುತ್ತಮವಾದ ನಾಮರಸಾಯನವನ್ನು ಪಾನ ಮಾಡಿಸಿದಾಗ ಮಾತ್ರ ಮನಸ್ಸು ಸ್ಥಿರಹೊಂದುತ್ತದೆಯೆಂದು. ಏಕೆಂದರೆ ಈ ಅಂತರೀ ಧ್ವನಿಯಾತ್ಮಕ ನಾಮಾಮೃತದ ರುಚಿಯ ಸಮಾನ ಬೇರೊಂದು ವಸ್ತು ಈ ಮೂರು ಲೋಕದಲ್ಲಿ ಇಲ್ಲ ಅಂತರ ಮಧುರವಾದ ರುಚಿ ಮನಸ್ಸಿಗೆ ಸಿಕ್ಕಾಗ ಈ ಜಗತ್ತಿನ ಎಲ್ಲಾ ಸುಖವೈಭವಗಳು ಕಹಿಯಂತೆ ಕಂಡುಬರುತ್ತದೆ.

ಈ ಏಕೈಕ ಸಾಧನೆಯ ಭೇದವನ್ನು ಪೂರ್ಣ ಸಂತ ಸದ್ಗುರುಗಳು ಮಾತ್ರ ಜಿಜ್ಞಾಸುಗಳಿಗೆ ತಿಳಿಸಬಲ್ಲರು. ಕವಿತಾಭಾರತಿ ಶ್ರೀ ಕೊಲ್ಲಪ್ಪ ನವರು ಈ "ಮನಸಾಶತಕ" ದಲ್ಲಿ ಮನಸ್ಸಿನ ಬಗ್ಗೆ ಸವಿಸ್ತಾರವಾಗಿ ಸುಂದರ ಶೈಲಿಯಲ್ಲಿ ಶತಕದ ರೂಪದಲ್ಲಿ ತಿಳಿಯ ಪ್ರಯತ್ನಿಸಿದ್ದಾರೆ. ಓದುಗರು ಈ ಶತಕವನ್ನು ಪಾಠಮಾಡಿ ತಮ್ಮ ತಮ್ಮ ಮನಸ್ಸನ್ನು ವಶಪಡಿಸಿ ಅಂತರೀ ಶಬ್ದ/ಧ್ವನಿ/ನಾಮದಲ್ಲಿ ಹಚ್ಚಲು ಪ್ರೇರಣೆಯಾಗಲು ಪೂಜ್ಯ ಸದ್ಗುರು ಮಹಾರಾಜರವರು ಕೃಪೆ ಮಾಡಲೆಂದು ಬಿನ್ನವಿಸುವೆವು.

ರಾಧಾಸ್ವಾಮಿ

ವಾಸು

ದಿನಾಂಕ : 5-11-99.

Sadguru-in-Peeta

ఆచార్య శలాక రఘునాథశర్మ
ఆంధ్రభారతి శాఖాధ్యక్షుడు
భాషా సాహిత్య విభాగముల డీన్
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం



శ్రీవేంకటేశ్వరపురం
అనంతపురం-515003
ఫోన్ : 55367 To 55373
Ext. 160, 195.

తేది 23-2-2000

## శుభాశంసనం

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని ఋషుల వాక్కు. పెక్కుమందికి అది బంధహేతువు కావటం, ఎవనికో ఒకనికి అది వశమై మోక్షహేతువు కావటం, లోకంలో చూస్తూ ఉంటాము.

మనస్సు మనదే. మనలోపల అది ఏరూపంతో ఎలా ఉంటుందో తెలియదు. ఒకవిధంగా ఆలోచిస్తే దానికి నిజంగా అస్తిత్వముందా? అని కూడా అనిపిస్తుంది. అందుకే దానిని సూక్ష్మశరీరంలో భాగంగా పరిగణించారు. కానీ ఇంత ఒడ్డూ పొడుగూ ఉన్న దేహం కంటె అది బలవత్తరమైనది. అయితే మంచిదే కదా! దానిబలం మనబలానికి తోడయి మన పురోగతికి దోహదం చేస్తుందని సంతోషించటానికి వీలులేదు. అది అతి చంచలమై తాను నిలువక మనలను నిలువనీయక అతలాకుతలం చేసి వేస్తుంది. మనం చేతకాని వాళ్లవలె చూస్తూ ఊరకుంటే నలిపిపారవేస్తుంది కూడా. ఇంత అనర్థాన్ని కలిగిస్తున్న ఈమనస్సు మనదే. మనం ముద్దు ముచ్చటలతో పెంచి పెద్ద చేసినదే!

వివేకవంతులు ఈ అనర్థాన్ని గుర్తించి మనస్సును వశం చేసుకోవటానికి, దానిని మోక్షహేతువుగా మలచటానికి తీవ్రప్రయత్నం చేస్తారు. ఆ ప్రయత్నం ఫలవంతమైతే అంతకంటె మహాలాభం మరొకటి ఉండదు.

శ్రీ సిద్ధేశ్వరం కొల్లప్పకవిగారు ఆ ప్రయత్నంలో పరిణతి సాధించటానికై 'మనసా' శతకం రూపొందించారు. "స్వయం తీర్త్వా పరాంస్తారయతి" అనికదా సూక్తి! తమ ప్రయత్నం తనతోటివారికి కూడా ఉపయోగపడితే అది ఆనందదాయకమైన సంగతే. ఆ దృష్టితో ఈ శతకాన్ని తెలుగుజాతికి అందిస్తున్నారు.

మనసుపోయే వింతవింత పోకులను ఎండగట్టటానికి వింతవింత ధోరణులతో వీరు ప్రబోధం చేస్తున్నారు. తేలిక పలుకులతో వేదాంత రహస్యాలను మిళితం చేసి మనకందిస్తున్నారు ఒక ప్రత్యేకత ఏమంటే

ఈశతకంలో ప్రతి పద్యానికి వీరు లఘుటీకను అందించారు. అది అనేక విషయాల అవగాహనకు ఆధారభూమిగా అలరుతున్నది. ఈ విధంగా ఈ గ్రంథం వేదాంతతత్త్వజ్ఞతకు ప్రాథమికఅధ్యయనగ్రంథంగా విరాజిల్లుతున్నది.

రచయిత హృదయంలో ఆర్తిఉన్నది. జిజ్ఞాస ఉన్నది. పదిమంది బాగుపడాలనే ప్రయోజనాపేక్ష ఉన్నది. జ్ఞానపరిమళాలను ప్రసరింపజేయగల భావనాపటిమ ఉన్నది. ఈ లక్షణాలతో వీరు భగవంతుణ్ణి భజించే నాలుగువిధాల వారికీ ఆత్మీయులౌతున్నారు. ఈ శతకం అందరినీ అలరిస్తుందనటానికి ఇదొక నిదర్శనం.

శ్రీ సిద్ధేశ్వరం కొల్లప్పగారికి భగవంతుడు సమస్త శుభపరంపరలు కలుగజేయుగాక.

శలాక రఘునాథశర్మ.

## సత్యమేవజయతే!

ప్రియమైన 'కవితాభారతి' సిద్ధేశ్వరం కొల్లప్పకవి గారికి

కొందరు లోకసేవాపరులు, త్యాగమూర్తులు నిత్యము లోకహితమే తమ జీవితలక్ష్యంగా తలంతురు.

అమూల్యము శాశ్వతము అయిన మానససరోవరమను శతకమును పంపినందుకు కృతజ్ఞుడను.

శతకమును పూర్ణముగా చదివితిని. అందులోని భాషకూడ లలితమై సర్వులకు అందుబాటులో నుండుట ఒక విశేషమే. స్వల్ప అద్వైత పరిచయమున్నవారికి కూడ అర్థమగునట్లు వ్రాసినారు.

ఈ శతకము వాస్తవముగాను, పఠనయోగ్యముగాను, సర్వజనరంజకముగాను ఉండుననుటలో అతిశయోక్తిలేదు. ఈ విధమైన అద్వైత తత్త్వమును తెలుపుటకు నిరంతరము శ్రమించు మీరు ధన్యులు. గురుదేవులు మిమ్ము సర్వవిధముల అనుగ్రహించుగాక!

ఓం తత్సత్

ఇట్లు భవదీయ

**D.A. నెట్టెప్ప**

Retd· అగ్రికల్చరల్ ఆఫీసరు
శ్రీ ఉమామహేశ్వర ఆశ్రమము
తిలక్‌నగర్, గుంతకల్లు.

తేది: 2-2-2000

# లోకోపకారము

'కవిరత్న' విద్వాన్ దాదన చిన్నయ్య
విశ్రాంత ఆంధ్రోపాధ్యాయులు
D. No.17/700-A1, తిలక్‌నగర్

గుంతకల్లు.
తేది 5-3-2000.

'కవితాభారతి' శ్రీసిద్ధేశ్వరం కొల్లప్పకవిగారు సరస్వతీ శతకము, సిద్ధేశ్వర శతకము, సద్గురు శతకము మున్నగు గ్రంథములను రచించినారు. వానిలో "మనసాశతక"మొకటి వీరేపద్యమును వ్రాసినను, అది ధారాళముగా నడచును. భావమునకు భాషయు, భాషకు భావము తగినట్టు రచించునేర్పు వీరికి వెన్నెతో బెట్టినవిద్యగా కనిపించును. కందము సుందర పద్యము. అది లయాన్వితముగా నడచుచు, చదువువారికి విను వారికి వీనులవిందు గావించును. ఇది దీనికి సహజలక్షణము కాని సామాన్యకవులందరు కందమునకు న్యాయము చేకూర్తురని చెప్పలేము శ్రీ కొల్లప్పకవిగారు కందపద్యములతో మనసాశతకమును రచించిరి. "మనసా" అనునది మకుటము ఈశతకమున 108 పద్యములున్నవి.

శ్రీ కొల్లప్పకవిగారు రాధాస్వామి సత్సంగులు. వీరికి గురువు ప్రేమనాథ్‌జీ సద్గురూపదేశమున సద్గతిపొందెదనని కవిగారు మనసుతో చెప్పిరి. (2. ప). హిందూమతమునకు చెందిన ఆధ్యాత్మికాంశముల న్నియు సంతుమతమున గలవు. అంతేగాక ఇంకనూ కొన్ని విశేషాంశము లిందు చోటుచేసికొన్నవి. రాధాస్వామిసత్సంగసంప్రదాయానుసారముగ బహువిషయములను ఈశతమునందు కవిగారు చేర్చిరి. "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" బంధ మోక్షములకు మనస్సే కారణము. అంతరింద్రియములగు మనోబుద్ధిచిత్తాహంకారములలో మనస్సుదే పైచేయి. అది చెప్పినట్లు తక్కిన మూడు ఆడవలయును మనసిజుడు అనగా మన్మథుడు ఓ మనసా! నీకు పుట్టిన మన్మథుడు అందరి హృదయాలను మథించి వేధించును. అతనిని నీవు అదుపులోపెట్టమని కవిగారు మనస్సును కోరిరి (14 ప). "ముక్తినొందుటకు ఆత్మకు నీవు సహకరింపుము" అనికూడ పల్కిరి 66వ పద్యమున మనస్సుయొక్క చాంచల్య లక్షణమును ఇట్లుతెలిపిరి. "మద్యము త్రాగిన కోతికి తేలుకుట్టినదట. పిశాచము పట్టినదట. అప్పుడాకోతి ఎట్లుండునో మనస్సుకూడా అట్టిదేనట శ్రీ కొల్లప్పకవిగారి రచనయందు ఉపమానములు, సామెతలు కోకొల్లలు.

అవి ఉపమేయమునకు తగినవైయున్నవి కవిగారు ఆధ్యాత్మిక రంగమున కావించిన విశేషకృషి మనసాశతక పద్యములయందు ప్రతిబింబించినది.

అణిమాదిసిద్ధులు, అష్టకష్టములు, చతుర్దశలోకములు, మున్నగు అనేకాంశములను గురించి ఈ శతకమునందు కవిగారు వివరించిరి. అట్టి పద్యముల క్రింద లఘువాఖ్యను కూడ వ్రాసి శ్రీ కొల్లప్పకవిగారు పాఠకులకు ఎంతో మేలు చేసినవారైరి.

జ్ఞానమిచ్చిన సద్గురువును మాత్రమేగాక జన్మనిచ్చిన తల్లిదండ్రులను కవిగారు స్మరించి, వారియెడ తనకున్న భక్తిభావమును వెల్లడించిరి. (106. ప) ఈ శతకముయొక్క ఔన్నత్యమును గూర్చి ఈ క్రింది పద్యము చాటుచున్నది చూడుడు.... అజ్ఞానము తొలగించును (107 ప)

కం॥ మనసది రౌతునుబట్టియె
చనునట్టి హయంబు, దానిసంగతిగల యీ
మనసా యను శతకము మీ
కు నితాంతయశంబు గూర్చు కొల్లప్ప కవీ!

మ॥ పవలున్ రేయి శ్రమించి హస్తమున పద్యాపాలతల్ పెంచుచున్
భవమున్ సద్గురు మంత్రశబ్దములచే భాసిల్లగా జేయుచున్
కవులున్ పండితులెల్ల మెచ్చుకొనగా కావ్యాళి నిర్మించు ఓ
కవితాభారతి! కొల్లపాఖ్యసుకవీ! కారుణ్యముప్పొర ఆ
భువనాధీశుడు మీకొసంగు సుఖముల్ పూర్ణాయురారోగ్యముల్.

లోకోపకారార్థము ఉదాత్తగ్రంథములను ఇంకను పెక్కింటిని రచించి సత్కీర్తి నార్జించుటకై కవితాభారతి శ్రీ సిద్ధేశ్వరం కొల్లప్పకవిగారికి ఆయురారోగ్యభాగ్యములు ప్రసాదింపుమని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు
దాదన చిన్నయ్య

# " నా మనసు "

భగవత్ సృష్టి అనంతమూ, విచిత్రమూ కూడా. అతని సృష్టిలో 'మనిషి' అనేవాడు మరీ విచిత్రము. అన్నీ తనవే అని అనుకుంటాడు. కానీ అన్నిటినుంచీ వేరైపోతాడు. వాని 'మనసు' అలాంటిది మరి. శ్రీ సిద్ధేశ్వరం కొల్లప్పకవిగారి మనసు ఎలాంటిదో వారి 'మనసాశతకం' చదివితే తెలుస్తుంది. ఆయన మనస్తత్త్వానికి అది దర్పణం.

మనిషిని వాని మనస్సును ప్రక్షాళన చేయడమే తన జీవనపద మార్గంగా భావించిన శ్రీ కొల్లప్పగారి హృదయసరోవరం నుంచి ఉదయించిన జ్ఞానసహస్రదళకమలం ఈ 'మనసా శతకం'. ఆ కమలాన్ని సద్గురు పాదసేవకు వినియోగించి తన జన్మను ధన్యము చేసికొన్నారు. ఆయనది 'పండిన మనసు' ఆ పండిన మనసులో మోక్షప్రాప్తిసాధనములుగా కర్మ, భక్తి, జ్ఞానమార్గములు నిర్దేశించడం జరిగింది.

"పాపము పుణ్యము జన్మకు
శాపముగా పరిణమించు సత్యం బిదియే
ఏపగు కర్మారణ్యము
ప్రాపగు జ్ఞానాగ్ని గాల్చి పరలుము మనసా!"

"పరమాత్మకు జీవాత్మకు
తెర యడ్డము నిలిచియుండె త్రెంచగ రాదే
అరయగ మాయయె యా తెర
మరుగున పడవేయునదియె మనుజుని మనసా!"

మృదు పదాలతో, వైదర్భీరీతిలో, మాధుర్యగుణ శోభితములైన ఈ చిన్నపద్యాల్లో 'త్యాగయ్య'ను సాక్షాత్కరింపజేసికొన్న కవిగారి సదాశయము సదా ప్రశంసనీయము.

వేదాంతాన్ని హృదంతరాళంలోనుంచి పలికించిన కొల్లప్పగారిలో ఒక ప్రహ్లాదుడున్నాడు- ఒక ధ్రువుడున్నాడు- ఒక్క గజేంద్రుడున్నాడు. ఆయా సందర్భాల్లో- ఆయా భావావిష్కరణలో- ఆయా పాత్రల్లో ప్రవేశిస్తూ ఉంటారు.

"మతముల మత్తున పడకుము - సోమరితనము త్యజించుము - విడువుమసూయాద్వేషములు" నేటి సమాజాన్ని ఆవహించి పీడిస్తోన్న ఈ పిశాచాల బారినుంచి దూరంగా తప్పకోమంటున్న కవిగారి బాధ బోధగా మారి అందమైన కందంలో అరవింద మకరందాలు జాలువారు స్తోంది.

"నీ వుండిననె ప్రపంచము (12వ పద్యము చూడుడు)

— అనే ఈ పద్యంలో లోకంలో శోకానికి గాని, సౌఖ్యానికి గాని అన్నింటికీ మనసే కారణమంటూ ఆ మనస్సును జయిస్తే "నీవు వసుధైక కుటుంబపఖ్యుడవౌతావు"- అని నర్మంగా మర్మంగా భారతధర్మాన్ని సూచించడం ఎంతో బాగుంది.

"రాళ్లూ, రప్పలనూ కొలిస్తే మోక్షము లభిస్తుంది అని ఎవరైనా అంటే నేను పెద్ద కొండనే కొలుస్తాను"- అనే కబీరుగారి మాటను తేనె తేటలో చెప్పడం కవిగారికి చెల్లింది.

"గురుదేవుల కంటె నధికు (56వ పద్యము చూడుడు)
లరయ చతుర్దశభువనములందెవ్వారుం
డరని తెలియదా?........"- అని తన గురుభక్తిని ప్రకటించి

ఈత రాని ఈ తరానికి ఈత నేర్పడం సబబుగా వుంది ఎంతో.

"భార్యా పుత్రులు బంధువు (76వ పద్యము చూడుడు)
అనే ఈపద్యంలో "కర్మాను గోగచ్ఛతి జీవ ఏకః"-

అనే ప్రవచనాన్ని బలపరచడం వారి ఆత్మబలాన్ని సూచిస్తోంది.

పద్యానికి కాలం చెల్లింది.అని అనుకొంటున్న ఈ కాలంలో - పద్యం ఇంకా నిలిచింది - అని పద్యంయొక్క ఉనికిని, మనుగడను దర్శింపజేసిన కొల్లప్పకవిగారి మనసు నిజంగా కందంలోచెక్కిన అందం.

చివరగా ఒకమాట - "కందం వ్రాసినవాడే కవి" అనే మాట నిజమైతే శ్రీ కొల్లప్పగారు కవిగారే. గురుకృపాకటాక్షలబ్ధసిద్ధకవి అయినట్టి శ్రీ సిద్ధేశ్వరంకొల్లప్పకవిగారికి రసజ్ఞుల ఆమోదం లభించాలని మనసా కోరుకుంటున్నాను.

ఇది శ్రీ కొల్లప్పగారిని గురించి 'నా మనసు' చెప్పింది.

ఇట్లు
విద్వాన్ **వేంకరాజుకాల్వ వీరభద్రాచార్యులు**
అవధానికేసరి-శుకబ్రహ్మ-ఆశుకవి
ప్రధానాంధ్రపండితులు
జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల
వజ్రకరూరు, అనంతపురం జిల్లా.

గుంతకల్లు,
12-3-2000.

# ఒక మంచిమాట

మానవుడు దేవుడుగా మారుటకు మానవత్వము మనుగడకు జీవన్ముక్తి నొందుటకు ఈక్రింది సద్గుణములు ప్రతివ్యక్తి అలవఱుచుకొన్నచో ప్రపంచములో హింసాప్రవృత్తులకు, యుద్ధములకు తావుండదు. ప్రపంచ శాంతి నెలకొంటుంది. కుల, మత, వర్గ, వర్ణ, ప్రాంతీయ భేదభావములు లేక అందరు సోదరులుగా మెలగుటకు అవకాశమేర్పడుతుంది.

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చయజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్.
శ్లో॥ అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునమ్
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్.
శ్లో॥ తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత!

(భగవద్గీత 16వ అధ్యాయము 1, 2, 3 శ్లోకములు)

అనగా భయము లేకుండుట, అంతఃకరణశుద్ధి కలిగియుండుట, జ్ఞానయోగమందుండుట, దానముచేయుట, బయటి ఇంద్రియముల నిగ్రహించుట, జ్ఞానయజ్ఞముచేయుట, సద్గ్రంథ పఠనముజేయుట, తపమాచరించుట, కపటము లేకుండుట, హింసచేయకుండుట, సత్యము పలుకుట కోపము లేకుండుట, త్యాగబుద్ధి కలిగియుండుట, శాంతిగానుండుట, చాడీలు చెప్పకుండుట, ప్రాణులయందు దయగలిగియుండుట, విషయ లోలత్వము లేకుండుట, నీతిమాలినపని చేయుటయందు సిగ్గుగలిగియుండుట, చంచలస్వభావము లేకుండుట. బ్రహ్మతేజస్సు కలిగియుండుట, కష్టములోర్చుకొనుట, ధైర్యముకలిగియుండుట, లోపల బయట శుచిగా యుండుట, ద్రోహచింతనము లేకుండుట, తాను గౌరవించబడవలెనను భావము లేకుండుట అను ఈ 26 దైవీగుణములు కలుగవలయునన్న మన మనస్సును మనము అదుపులోనుంచవలయును. మనస్సును అదుపులో నుంచవలెనన్న జ్ఞాననేత్రము విప్పారవలయును. జ్ఞాననేత్రము విప్పారవలెనన్న గురుమంత్రము కావలెను. గురుమంత్రము కావలెనన్న సద్గురువుచెంత చేరి చతుర్విధశుశ్రూషలు చేయవలెను. గురుమంత్రోపదేశముచేత అజ్ఞానతిమిరము తొలగును. జ్ఞానజ్యోతివెలుగును. మానవుని భ్రాంతులన్నియు ఉడుగును 'నహి జ్ఞానేన సదృశమ్' జ్ఞానమునకు సమానమైనదేదియులేదు. 'జ్ఞానేన పరిసమాప్యతే' జ్ఞానము పొందిన తరువాత ఈ ప్రపంచములో ఇంక తెలిసికొనవలసిన విషయముండదు. జ్ఞానము చేత అంతయు పరిసమాప్తమౌతుంది. జ్ఞానము వలన జీవన్ముక్తి దొరకుతుంది దానివలన శాశ్వతబ్రహ్మానందము లభిస్తుంది ఇదియే మానవ జీవితలక్ష్యము కావలెను.

రచయిత

తేది. 21-3-2000.

సిద్ధేశ్వరం కొల్లప్పకవి

# స్మృత్యంజలి

కం॥ ధర గురువులైదుగురు గల
రరయంగా తల్లితండ్రులధ్యాపకుడున్,
పెరపణచునతయు, తత్త్వం
బెరిగించెడునతడు వీరనెద భజయింతున్.

కం॥ సాకమ్మయు సిద్దప్పయు
నాకుంజననీజనకులు నయగుణచరితుల్
నే కృతినిచ్చితి తండ్రికి
తేకువ మును శ్రీ సరస్వతీ శతకంబున్.

## అంకితము



కం॥ తొమ్మిది నెలలున్ తన జఠ
రమ్మున భరియించి నన్ను ప్రాణమునకు ప్రా
ణమ్ముగ కనిపెంచిన మా
అమ్మకు "మనసా శతకము" నంకితమిత్తున్.

తల్లి నిర్యాణము : 17-6-1999

తండ్రి నిర్యాణము : 17-3-1976

రచయిత
సిద్దేశ్వరం తొల్లప్ప.

"రాధాస్వామి దయాళ్‌కీ దయా రాధాస్వామి సహాయ్"

# మనసా శతకము
# లేక
# మానస సరోవరము



కం॥ రాధాస్వామీ! సద్గురు
బోధామృతమును గ్రహించి భూసౌఖ్యములన్
సాధనచే విడనాడిన
సాధింపగవచ్చు ముక్తి సత్యము మనసా. 1

భూసౌఖ్యము = భూమిపై సుఖము.

కం॥ సద్గురువు ప్రేమనాథుడు
మద్గురుడై బోధనొసగె మాయ తొలంగన్
గద్గద కంఠనుతిస్థితి
సద్గతిని బొందెదను చూడు చపలపు మనసా. 2

మద్గురుడు = నాయొక్కగురువు; గద్గదకంఠము = డగ్గుతికతోకూడిన కంఠధ్వని; నుతి = పొగడిక; చపలము = కదలిక.

కం॥ సంత్సంగత్వమసంగము
సత్సంగమె సద్గురువరసాంగత్యమహో
వాత్సల్యమునకు హేతువు
కుత్సితమును వీడవమ్మ కుటిలపు మనసా. 3

సత్సంగత్వము = మంచివారితోకలియుట; అసంగము = కూడకుండుట; వాత్సల్యము = పుత్రాదులయందుగలస్నేహము; హేతువు = కారణము; కుత్సితము = నికృష్టము, కీడువడినది; కుటిలము = వంకరబుద్ధి;

కం॥ పావనసింగు మహోరా
జావల సత్ సోమనాథులమృతమయుల స
త్పావన మూర్తి కబీరుల
నీవు తలింపగ స్మరింపుమెప్పుడు మనసా. 4

సత్పావనమూర్తి = మంచి పవిత్రరూపము; తలించుట = దాటుట

కం॥ గీతాచార్యుని కృష్ణుని
జ్యోతిర్మయుడు గురునానకున్నతునెదలో
శ్రీ తులసీ దాసు కవిని
స్వాతిశయము వీడి తలచు శ్రద్ధగ మనసా. 5

స్వాతిశయము = సొంత ఆధిక్యము;

కం॥ చేరితివి నిర్మలాత్మల
కోరికతో బ్రహ్మలోక గోళమునందున్
స్వారి యొనర్తువు భూస్థలి
కోరికలన్నిటిని నింపి కూల్చగ మనసా. 6

గోళము = మండలము;

కం॥ నీవే దయ్యము భూతము
నీవే శాకినియు డాకినియు ప్రేతాత్మా
నీవే మాయామోహము
నీవే జ్ఞానధనచోరిణివి ధర మనసా. 7

ప్రేతాత్మా = నరకమునందుండు జంతువుయొక్క ఆత్మ; చోరిణి = దొంగది; ధర = భూమి;

కం॥ సంకల్ప వికల్పములవి
వంకరటింకరగ పుట్టవా? నీవలనన్
బింకముగ వాని తుడుపవె?
పొంకమ్మగు బుద్ధి చెలుప బూనిన మనసా. 8

సంకల్పము = మనోవ్యాపారము; వికల్పము = భ్రాంతి, మారుదల;
బింకము = బిగువు, గర్వము; పొంకము = పొందిక.

కం॥ నీవంతరింద్రియములకు
భావింపగ నేత్రివగుచు బంధింతువు గా
దా! వానిని, నవియును నీ
తావెఱుగక పొందుచుండు తాపము మనసా. 9

అంతరింద్రియములు నాలుగు 1) మనస్సు 2) బుద్ధి, 3) చిత్తము 4) అహంకారము; నేత్రి= నాయకురాలు; తావు= చోటు; తాపము = బాధ; తాపత్రయము 1) ఆధ్యాత్మికతాపము 2) ఆధిభౌతిక తాపము 3) ఆధిదైవికతాపము.

కం॥ క్షణమొక్క చోట నిలబడ
కణువణువున తిరిగి వచ్చియలయుదువేలా?
తృణమును పణమును గోరిన
గుణవతి యని యనరు బుధులు క్రూరపు మనసా. 10

అణువు= అల్పము; అలయుట= శ్రమపడుట; తృణము= గడ్డి; పణము= ధనము; బుధులు= విద్వాంసులు; క్రూరము= నొప్పించునది.

కం॥ ధర్మార్థ కామ కృత్యము
నిర్మలముగ నాచరింప నీవును మాకున్
కూర్మిం దోడ్పడుచో ని
ష్కర్మ విధానమున ముక్తి కలుగును మనసా. 11

పురుషార్థములు నాలుగు 1) ధర్మము 2) అర్థము 3) కామము 4) మోక్షము; నిష్కర్మ= పని చేయకుండుట.

కం॥ నీవుండిననె ప్రపంచము
నీవున్న కళత్ర పుత్రనిచయము కలుగున్
నీవున్ననె సుఖదుఃఖము
లేవైనను పొడముచుండునెప్పుడు మనసా. 12

ప్రపంచము= పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశములతో కూడినది; కళత్రము= భార్య; పుత్రనిచయము= కొడుకుల సమూహము; పొడముట= పుట్టుట.

కం॥ హద్దెరుగని యనురాగము
సుద్దులు ముద్దులు ధ్రువంబె సురతము స్థిరమే
"యద్దృశ్యం తన్నశ్యం"
బొద్దికతో దీనినరసి యుండుము మనసా. 13

అనురాగము = అతిరక్తి; ధ్రువము = నిశ్చయము; సురతము = స్త్రీ పురుషుల కలయిక; యద్దృశ్యం తన్నశ్యం = కంటికి కనబడునది నశించును; ఒద్దిక = అనుకూలము.

కం॥ మనసిజుడు నీ కుమారుడు
మనుజుల నిరతము మథించి మరులు గొలిపి తా
ననలము వలె వేధించును
తనయుని చేష్టలడగించి తనరుము మనసా. 14

మనసిజుడు = మన్మథుడు; నిరతము = ఎల్లప్పుడు; మథించి = మథనపరచి; మరులు = మోహము: అనలము = అగ్ని; వేధించుట = బాధించుట; తనయుడు = కొడుకు; చేష్ట = వ్యాపారము; తనరుట ప్రకాశించుట.

కం॥ సత్వరజస్తమములు ని
త్యత్వము దాలుచుటసాధ్యమరయగ ధరణిన్
తత్వంబు బోధపడ చప
లత్వము మటుమాయమగును లాలస మనసా. 15

గుణములు మూడు 1) సత్వగుణము 2) రజోగుణము 3) తమోగుణము: నిత్యత్వము = శాశ్వతము; తత్త్వము = ఆపరమాత్మయే నీవు; లాలస = అభిలేచ్ఛ.

కం॥ తంటాలమారితనమున
కొంటెపనులు కొల్లలుగ ప్రకోపింపగా
తుంటలుగ జేసివైతువు
వెంటాడుచు సద్వివేకవిజ్ఞుల మనసా. 16

ప్రకోపించు = ముమ్మరించు; సత్ + వివేకము = మంచితెలివి; విజ్ఞులు = నేర్పరులు.

కం॥ నీవే చేతనమగుదువు
భావింపగ చూపులోను, వాసన రుచులం,
దావినికిడి, తాకుడులో
నీవుండక కదలలేవు నిజమిది మనసా. 17.

చేతనము= ప్రాణము; వినికిడి= వినునట్టినది; తాకుడు= స్పర్శ;

కం॥ నుడివిరి మును పట్టుకొనిన
పిడికిలి నిండయని విడువ పెనుగృహమెల్లన్
వడి వ్యాపించు నటంచును
సుడి గుండము పోలె జనుల చుట్టకు మనసా. 18.

నుడివిరి =చెప్పిరి; పెనుగృహము= పెద్దయిల్లు; వడి= వేగము:
సుడిగుండము= జలావర్తకుండము;

కం॥ సతిపతి గూడిన సుతతతి
యతులితముగనిష్టసిద్ధి యబ్బనరీతిన్
మతిమంతురాలవై స
ద్గతి బొందగనాత్మతోడ కలియుము మనసా. 19.

సతిపతులు= ఆలుమగలు; సుతతతి= సంతతినిచయము;
అతులితము =సరిలేనిది; ఇష్టసిద్ధి= కోరినది నెరవేరుట;
సద్గతి =మోక్షము

కం॥ భర్తను తృణీకరించిన
ధూర్తస్త్రీ పరగృహముల దూరిన భంగిన్
వర్తించకుమాత్మకు వశ
వర్తినివై ముక్తి పథము పట్టుము మనసా. 20.

తృణీకరించు= తిరస్కరించు; ధూర్తస్త్రీ= మోసగత్తెయగు ఆడుది;
పరగృహము= వేరేయిల్లు; భంగి= విధము; వర్తించకు= నడువకు;
వశవర్తి = లోబడినడచునది; పథము= దారి.

కం॥ నీవరయ వాయు భూతం
బేవిధమున స్థిరత నీకు నేర్పడ గలదో?
దేవుడు కనబడవలెనన
చావంగ వలయు నీవు సత్యము మనసా. 21.

అరయగ = విచారించగ; వాయుభూతము = పంచభూతములలో గాలి తత్త్వము.

కం॥ సస్యమ్మొండక మానునె?
దస్యులకు సుజనులకు మృతి తప్పగలదె? "జా
తస్య మరణం ధ్రువ" మ్మగు
నస్యోతంబులు యమునికి నరులో మనసా. 22

సస్యము= పైరు; దస్యులు= దొంగలు లేక శత్రువులు; సుజనులు= మంచివారు; మృతి= చావు; జాతస్య= పుట్టినవానికి; మరణం= చావు; ధ్రువమ్ = నిశ్చయము; నస్యోతములు = ముక్కుతాడు కుట్టిన యెద్దులు;

కం॥ మత్కుణము మంచమందు చ
లత్కార్యము వీడి పగలు లలిదాగు విధిన్
సత్కాలక్షేపమునన్
తత్కిమ్మనకుండ లోన దాగవె మనసా. 23.

మత్కుణము = నల్లి: చలత్కార్యము = సంచరించుపని; లలి = క్రమము; సత్కాలక్షేపము= మంచికొరకు సమయము వెచ్చించుట తత్కిమ్ = అదిఏమి;

కం॥ ఏకాగ్రతతో ధ్యానము
జోకగ జేయంగబోవ జూదరివోలెన్
కాక కలిగింతువాత్మకు
నీకెక్కడి నీతి గలదు నీచపు మనసా. 24.

ఏకాగ్రత = ఒకదానిపై ధ్యాసనుంచుట; జోక = బాగు; కాక= తాపము;

కం॥ తిమ్మిని బమ్మిని జేతువు
తిమ్మన్నను కొమ్మజేసి తెగములియుదువే
ఎమ్మెలు జేయుచునెన్నో
నిమ్మకు నీరెత్తినట్లు నిలుతువె మనసా. 25.

తిమ్మన్న = కోతి; కొమ్మ = ఆడుది; తెగములియు = నిండుగా గర్వించు; ఎమ్మెలు = అధిక ప్రసంగములు.

కం॥ అరయగ ప్రసూతి పితృవన
పురాణవైరాగ్యములన పొందుగ మూడౌ
ఇరవుగ నిజవైరాగ్యమ
మరునటె గురుబోధలేక మాంద్యపు మనసా. 26.

తత్కాలవైరాగ్యములు మూడు 1. పురాణవైరాగ్యము 2. ప్రసూతి వైరాగ్యము 3. శ్మశానవైరాగ్యము; ఇరవుగ = స్థిరముగ; అమరు = సిద్ధించు; మాంద్యము = ఆలస్యము; పితృవనము = శ్మశానము.

కం॥ చలన రహితమౌ రాళ్ళను
కొలిచిన మోక్షము లభింప కొండనె కొలుతున్
ఇలనని కబీరు నుడువడె
ఫలితము లేనట్టిపూజ భ్రష్టమె మనసా 27.

చలనరహితము = కదలిక లేకుండుట; ఇల = భూమి; భ్రష్టము = జారవిడుచుట.

కం॥ మానస పూజయె శ్రేష్ఠము
ధ్యానము పై దానికంటె ధరనుత్తమమౌ
కాననము కంటె గృహమే
జ్ఞానము బొందంగ తగిన స్థలమౌ మనసా. 28.

ధర = భూమి; ఉత్తమము = శ్రేష్ఠమైనది; కాననము = అడవి; ధ్యానము = చాంచల్యము లేక భగవంతుని మనసున తలంచుట.

కం॥ పాపము పుణ్యము జన్మకు
శాపముగా పరిణమించు సత్యంబిదియే
ఏపగు కర్మారణ్యము
బ్రాపగు జ్ఞానాగ్ని గాల్చి వరలుము మనసా 29.

పరిణమించు = మారు. ఏపగు = అధిక్యమైన; కర్మ + అరణ్యము = కర్మఅనెడు అడవి; ప్రాపు = ఆశ్రయము; జ్ఞానాగ్ని = ఎఱుక అను అగ్ని.

కం॥ పరమాత్మకు జీవాత్మకు
తెరయడ్డము నిలిచియుండె త్రెంచగరాదే
అరయగ మాయయె యా తెర
మరుగున పడవేయునదియె మనుజుని మనసా. 30.

తెర = పరదా-

కం॥ అకలంకముక్తి. ధర స
ప్త కోటి మంత్రాలు చదువ ప్రాప్తించునొకో
సకలము తనలో నుండగ
నికనెందుల"కోనమాలు" హేయపు మనసా. 31.

అకలంకము = కళంకము లేనిది; సప్తకోటి = ఏడుకోట్లు; ప్రాప్తించు = పొందు; హేయము = విడువదగినది.

కం॥ అరిషడ్వర్గములోనతి
దురాత్మకులు కామమొకటి తోరపు క్రోధం
బరయగనొక్కటి యవి యమ
పురమునకున్ సాగనంపు మూర్ఖపు మనసా. 32.

అరిషడ్వర్గము 1. కామము 2. క్రోధము, 3. లోభము. 4. మోహము, 5. మదము, 6. మత్సరము. తోరము = బలిష్ఠము.

కం॥ తమకమున జిహ్వా చాప
ల్యముతోడ పదార్థతతులనన్నిటి నడుగున్
సమమైన గుహ్యా చాప
ల్యము భోగేచ్ఛలకు దార్చునజ్ఞుని మనసా. 33.

తమకము= మోహము; జిహ్వ = నాలుక; చాపల్యము = చాంచల్యము; పదార్థతతి= షడ్రసోపేతమైన పంచభక్ష్యముల సమూహము; గుహ్యము= స్త్రీ పురుషుల గుటి (యోని లేక శిశ్నము). భోగ+ఇచ్ఛ = సంభోగపుకోర్కె; తార్చు = కదియించు లేక దగ్గరజేర్చు; అజ్ఞుడు =తెలివిలేనివాడు.

కం॥ దేహము తానను భ్రాంతిని
మోహావేశమున బెంచి ముంచెదవాత్మన్
దేహిని దుర్గతి పట్టగ
కాహళమూదెదవిదేల కసియో మనసా. 34.

భ్రాంతి= లేనిది ఉన్నట్లుభ్రమించు; దేహి= జీవుడు; కాహళము= వాద్యవిశేషము; కసి= కోపము, దురద.

కం॥ సప్తవ్యసనముల మునిగి
లిప్త సమయమైన దైవలీలలు స్మృతికిం
దృప్తిగ రానీయవు గద!
లుప్తము నీబ్రతుకు చూడ లొంగవె మనసా. 35.

సప్తవ్యసనములు 1. వెలది, 2. జూదము, 3. మద్యపానము, 4. వేట, 5. కఠినపు మాటలాడుట, 6. దండము, 7 నిష్ప్రయోజనముగా ధనము ఖర్చుపెట్టుట, లిప్త= క్షణము 0.4 సెకెండ్లకాలము; స్మృతి =తలపు, బుద్ధి; లుప్తము= లోపించినది; తృప్తి= తనివి.

కం॥ వాసి శ్రవణ, మనన, నిది
ధ్యాసనములనవరతము ప్రయాసముపడి య
భ్యాసము సలుపుచు నుండిన
దోసములన్నియును తొలగు దోడ్తో మనసా. 36.

వాసి= పరిమితి, శ్రవణము, మననము, నిదిధ్యాసనములను జ్ఞానమార్గములో ప్రయాణించువారికి తొలిమెట్లు;అనవరతము= ఎల్లప్పుడు; ప్రయాసము= కష్టము; దోడ్తో= వెంబడిని.

కం॥ మనుజుడు నిద్రాహారము
లను. భయ. మైథునములనెడు లాలసవార్ధి
న్ననయము మునుగుచు దేలుచు
కనబోడాత్మప్రకాశగగనము మనసా. 37.

మైథునము = భార్యభర్తల కలయిక; లాలసవార్ధి = అధికేచ్ఛయను సముద్రము; అనయము= ఎల్లప్పుడు; గగనము =ఆకాశము;

కం॥ చోరాఢ్యమీషణత్రయ
మారయ తద్బంధమందు నాత్మయణంగెన్
దారేషణ పుత్రేషణ
క్రూర ధనేషణ మథించు కుమతుల మనసా. 38.

చోరాఢ్యము = దొంగతనమందు సమృద్ధము; ఈషణము = త్వరపెట్టునది; త్రయము =మూడు; బంధము = కట్టుబడుట; మథించు = త్రచ్చు (చిలుకు); కుమతులు =చెడుబుద్ధి గలవారు.

కం॥ కులుకెడ గద జాగ్రదవ
స్థలోన మరులుగొలుపుమవు స్వప్నావస్థన్
చలనమది సుషుప్తిదశ
దళమగు శూన్యంబు నీకు తక్కరి మనసా. 39.

జాగ్రదవస్థ =మేలుకొనియుండు అవస్థ; స్వప్నము =కల; చలనము =కదలిక; సుషుప్తి = కలలులేని గాఢనిద్ర; దళము = అధికము; శూన్యము =సున్న; తగవరి= తగినదై యుండెడిది.

కం॥ గురువు చెప్పిన వాక్యము
మఱుగున పడవేసి బయట మసలుదువెపుడున్
పరకాంత పరధనంబుల
మరగుదువవె నంగనాచి మాయల మనసా. 40.

మరగుట =ఆశపడుట; నంగనాచి= దిట్టతనము కలిగియు బయటికి ఏమియు తెలియనిదానివలె నుండుట.

కం॥ అండము పిండము మరి బ్ర
హ్మాండము సైతము నశించునవి బుద్బుదముల్
కుండలినీ శక్తివృథా
మొండిగనివియెల్ల నమ్మి మురియకు మనసా. 41.

అండము = గ్రుడ్డు; పిండము = గర్భము; బ్రహ్మాండము = బ్రహ్మానిర్మితమైన లోకము; బుద్బుదము = నీటిబుగ్గ; కుండలినీశక్తి = ప్రాణాయామము చేయుటవలన మేల్కొనుపాము ఆకారములో గల మహిమలు కలిగించు శక్తి; మురియకు = గర్వించకు.

కం॥ నియతగురునామజపమున
భయమంతయు తొలగునఘము పరుగులు బెట్టున్
రయమున యెఱుంగును "మనో
మయంజగత్తి"ని వివేకి మనుజుడు మనసా. 42.

నియతము = నిత్యమైనది; జపము = మంత్రావృత్తి; అఘము = పాపము; రయము = వేగము; మనోమయం జగత్ = మనస్సుతో కూడినదే జగత్తు; వివేకి = బుద్ధిమంతుడు;

కం॥ మైనముతోనే రూపము
నైన వినిర్మించవచ్చునట్లే నిన్నున్
జ్ఞానముతోనాత్మముఖము
గా నయమున త్రిప్పవచ్చు గారడి మనసా. 43.

మైనము = సిక్థకము; గారడి = పాములవాడు.

కం॥ "నా కులమెక్కువ" "నా మత
మే కడుగొప్పది" యటంచు మేడ్పడబోకే!
ఏకులమతదేహమయిన
నా కాశ్యపి గర్భమందునణగదె మనసా. 44.

మేడ్పడు = అజ్ఞతబొందు; కాశ్యపి = భూమి;

కం॥ అష్టైశ్వర్యములబ్బిన
కాష్ఠంబును కాల్చునగ్నికైవడి భువి క
ష్టాష్టకము గాల్చ చెదరని
శిష్టజనావళికి ముక్తి చిక్కును మనసా. 45.

అష్టైశ్వర్యములు 54 వ పద్యపు టీకలో చూడవలెను.

కాష్ఠము = కట్టె; కైవడి = విధము; కష్టాష్టకము = ఎనిమిది విధముల కష్టములు. వానినే అష్టకష్టములందురు 1) దేశాంతరగమనము 2) భార్యావియోగము, 3) ఆపత్కాలమందు బంధుదర్శనము. 4) ఉచ్ఛిష్టభక్షణము, 5) శత్రుస్నేహము. 6) పరాన్నప్రతీక్షణము. 7) భంగము 8) దారిద్ర్యము; శిష్టులు = మంచివారు; ఆవళి = పంక్తి

కం॥ దినమునకిరువదియొక వే
లు నాఱువందలగు శ్వాసలు వినష్టమగున్
మనుజుని యాయువునందున
కనజాలవు మాయకప్పగా నిను మనసా. 46.

శ్వాస = ఊపిరి.

కం॥ కాలవశులజుడు విష్ణువు
బాలేందుధరుడు కూడ భ్రాంతి తొలంగన్
వాలాయంబును నిర్గుణ
శీలు, నిరాకారునెద భజింపరె? మనసా. 47.

అజుడు = బ్రహ్మ; బాలేందుధరుడు = పరమేశ్వరుడు; భ్రాంతి = లేనిది ఉన్నట్లు తలచుట; వాలాయము = ఎల్లప్పుడు; నిర్గుణశీలుడు = సత్త్వరజస్తమోగుణములు లేని పరమాత్ముడు; నిరాకారుడు = ఆకారములేనివాడు;

కం॥ ఎనుబది నాలుగు లక్షల
తనుయోనుల బుట్టి చచ్చి తాపంబున నీ
మనుజ శరీరము నొందితి
వణకువతో గురుని గొల్వనరుగవె మనసా. 48.

తనువు = శరీరము; యోని = అడుగుజీ.

కం॥ సల్లోకము, సన్నామము
ముల్లోకములందు శ్రేష్ఠములును, స్థిరంబుల్
కల్లయు కపటము నెఱుగని
యుల్లంబులు వీని పడయనోపును మనసా. 49.

సత్+లోకము=సత్యలోకము, వైకుంఠము, కైలాసమున కంటె పై నుండునది; సత్+నామము = సత్యమైన, శాశ్వతమైన నామము; రాధాస్వామి సిద్ధాంతము ప్రకారము అదే గురుమంత్రము; మూడు +లోకములు=సర్గ, మర్త్య, పాతాళములు; కల్ల =అబద్ధము; కపటము= మోసము; ఉల్లము= మనస్సు.

కం॥ వేదములు నాల్గు జదివిన
నాదట శాస్త్రంబులాఱు నరసిన ధరన
ష్టాదశ పురాణపఠనము
వాదునకై జేయ ముక్తివచ్చునె? మనసా. 50.

నాలుగు వేదములు: 1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3. సామవేదము, 4. అధర్వణ వేదము: ఆరుశాస్త్రములు: 1. తర్కము, 2. వ్యాకరణము. 3. ధర్మము, 4. మీ మాంస. 5. వైద్యము. 6 జ్యోతిషము; అష్టాదశపురాణములు: 1. బ్రహ్మము, 2. పాద్మము. 3. వైష్ణవము, 4. శైవము. 5. భాగవతము, 6. నారదీయము, 7. మార్కండేయము, 8, ఆగ్నేయము, 9. భవిష్యత్తు, 10. బహ్మకైవర్తము 11. లైంగము, 12. వారాహము, 13. స్కాందము, 14. వామనము, 15. కౌర్మము, 16. మాత్స్యము, 17. గారుడము, 18. బ్రహ్మాండము.

కం॥ మమకారాహంకారము
లిముడ్చు కొన్నట్టి దేహమెన్నటికైనన్
విమలాంతర్జ్యోతిని కన
దు మాయ కప్పిన కతమున దుష్టపు మనసా. 51.

మమకారము= 'నాది' అనుభావము, అహంకారము ='నేను' అను భావము; విమలము =కల్మషము లేనిది; అంతర్జ్యోతి =లోపలివెలుగు కతమున= కారణమున.

కం॥ పరకాంతలనాశింపక
నిరతము సద్గురుని దలచు నిష్ఠాపరునిన్
ధరలో దుర్బలుడందురు
దురాత్ములోర్వంగ లేక దోపరి మనసా. 52.

నిష్ఠాపరుడు= ధర్మాదులయందు శ్రద్ధకలవాడు; దోఁపరి= దొంగ;

కం॥ ప్రతికార్యము శంకింతువు
హితాహితంబుల దలంపకెందుకు చెపుమా?
మతిమంతులైన జెడుదురు
గతినీవని నమ్మికొన్న కపటపు మనసా. 53.

శంకించు =అనుమానించు; హితము= మేలు; అహితము= కీడు.

కం॥ అణిమాది సిద్ధులెల్లన
గణితముగా వచ్చెనేని గర్వము హెచ్చున్
తృణము కొఱకు నిర్వాణము
పణమొడ్డినయట్లుగాదె? స్వార్థపు మనసా. 54.

అష్టసిద్ధులు: 1. అణిమ, 2. మహిమ, 3. గరిమ, 4. లఘిమ, 5. ప్రాప్తి, 6. ప్రాకామ్యము 7. ఈశత్వము, 8. వశిత్వము, వీనిని అష్టైశ్వర్యములనియు అందురు. తృణము =గడ్డి; నిర్వాణము =మోక్షము; పణము= పందెము.

కం॥ మూడవ నేత్రముతో లో
జాడను పరికింపవలయు జాగ్రదవస్థన్
వీడని భక్తిన్ కరములు
జోడించుము గురువునెదుట జోకన్ మనసా. 55.

కరము =చేయి; జోక= బాగు.

కం॥ గురుదేవులకంటెనధికు
లరయ చతుర్దశ భువనములందెవ్వారుం
డరని తెలియదా? తెలిసియు
మరుగయ్యెదవేల? గురుని మరచుచు మనసా. 56.

చతుర్దశభువనములు: 1) భూలోకము, 2) భువర్లోకము. 3) సువర్లోకము, 4) మహర్లోకము, 5) జనలోకము, 6) తపోలోకము. 7) సత్యలోకములు, (ఈ యేడు ఊర్ధ్వలోకములు) 8) అతలము. 9) వితలము, 10) సుతలము, 11) రసాతలము, 12) మహాతలము, 13) తలాతలము, 14) పాతాళము (ఈ యేడును అధోలోకములు)

కం॥ అష్టాంగయోగములనతి
కష్టముతో జేయనేల? కఠినములవి యీ
సృష్టికి మూలము శబ్దము
చేష్టలుడిగి దానియందు చేరుము మనసా. 57.

అష్టాంగయోగములు: 1) యమము, 2) నియమము. 3) ఆసనము, 4) ప్రాణాయామము, 5) ప్రత్యాహారము, 6) ధ్యానము, 7) ధారణ 8) సమాధి. శబ్దము = ధ్వని; చేష్ట = వ్యాపారము.

కం॥ భ్రూమధ్య దృష్టి నిల్పుము
కామములన్నియు త్యజించ కాంతువు జ్యోతిన్
ఏమేమో వీక్షింతువు
సామముతోనాత్మజేరి సాగుము మనసా. 58.

భ్రూమధ్యము = రెండుకనుబొమల మధ్యభాగము; కామము = కోరిక; వీక్షించు = చూచు; సామము = మంచిమాట.

కం॥ దేవునికి ప్రియులు ద్వేషులు,
నేవేళలనుండరెచటనెల్లరు సములే
కావడొకో పరమాత్ముడు
నీవు సతంబును స్మరింప నిక్కము మనసా. 59.

కావడొకో = కాపాడును గదా; సతము = ఎల్లప్పుడు; స్మరించు = తలచు; నిక్కము = నిజము.

కం॥ తనువును నిన్నును ధనమును
జననమరణరహితమైన జ్ఞానము బొందన్
వినయభయభక్తులన్ గురు
వునకర్పించి ముదమింక పొందుము మనసా. 60.

తనువు = శరీరము; రహితము = లేకుండ; ముదము = సంతోషము.

కం॥ ఈగలు గాయము కోరును
భోగేచ్ఛన్ నృపులు ధనము భువిగోరుదురే
ఓగులు కలహము మెత్తురు
యోగులు కోరెదరు శాంతినోరిమి మనసా. 61.

నృపులు = రాజులు; ఓగులు = మూర్ఖులు; కలహము = కొట్లాట; ఓరిమి = ఓర్పు

కం॥ భోగములెనిమిది వస్త్రము
నా గృహమును, శయ్య, వనిత, యాభరణము, పూ
లా, గంధము, తాంబూలము
నే గతి గన నశ్వరములు హీనపు మనసా. 62.

శయ్య = పరుపు; వనిత = స్త్రీ; కన = చూడ; నశ్వరము = అశాశ్వతము.

కం॥ కాంత, కుసుంభము విమలై
కాంతధ్యానంబు నిష్ఠ ఘనుడగు యతికిన్
సొంతము కాకూడదతని
హంతకునిగ జేయజూచునవి కన మనసా. 63.

కాంత = స్త్రీ లేక భార్య; కుసుంభము = బంగారు; ఏకాంతము = ఒంటరిగానుండుట; యతి = సన్యాసి; హంతకుడు = చంపువాడు.

కం॥ "గు" యనగ తమమజ్ఞానము
"రు" యన ప్రభాజ్ఞానములగు రోచిష్ణు గురున్
రయమున వెదకి కనుగొనుము
నయముగ జ్ఞానంబుబొంద నలగక మనసా 64.

తమము = చీకటి; ప్రభ = వెలుగు, కాంతి; రోచిష్ణువు = ప్రకాశించువాడు; రయము = వేగము; నయము = మృదుత్వము; నలగక = పీడింపక, శ్రమపడక.

కం॥ చాలును జిహ్వోపస్థల
లాలించెడు కార్యమింక లాలసయేలా ?
బాలిశచేష్టలు విడిచిన
కాలుని పాశంబు బడదు కాంచవె మనసా ! 65.

జిహ్వ = నాలుక: ఉపస్థ = స్త్రీ పురుషుల రహస్యావయవములు; బాలిశచేష్ట = పిల్లచేష్టలు; కాలుడు = యముడు; పాశము = త్రాడు కాంచు = చూచు.

కం॥ మద్యము త్రాగిన కోతికి
సద్యము తేల్కుట్టగా పిశాచము పట్టన్
చోద్యముగ సంచలింపదె?
ఆద్యంతంబట్టిదానవగుదువు మనసా ! 66.

సద్యము = అప్పుడు; చోద్యము = ఆశ్చర్యము; సంచలించు = ఎక్కువగా తిరుగు; ఆద్యము = మొదటిది; అంతము = కడపట

కం॥ ప్రారబ్ధము సంచితమున్
వారని యాగామి కర్మవర్గపుటడవిన్
ధీరగురూత్తము జేరిన
సారజ్ఞానాగ్ని గాల్పజనుగద మనసా ! 67.

ప్రారబ్ధము = ప్రస్తుతజన్మపు తనువుతో అనుభవించు కర్మము లేక శరీరమునెత్తించెడు కర్మవిశేషము; సంచితము = ఇంతకు మునుపు జన్మములందు కూడబెట్టిన కర్మ; ఆగామి = రాగల జన్మములందు ప్రోగగు కర్మ; ధీరుడు = విద్వాంసుడు; సారజ్ఞానము = శ్రేష్ఠమైన ఎఱుక

కం॥ త్రికరణ శుద్ధిగ సద్గురు
సకలేశ్వరు గొలుతువేని సద్గతి దొరకున్
వికలత బయటందిరుగ న
రకమె శరణ్యంబు నీకు రంగుల మనసా ! 68.

త్రికరణములు:- 1) మనస్సు. 2) వాక్కు. 3) కర్మము. (పని)
వికలత = విచ్ఛేదముతో; శరణ్యము = గతి

కం॥ సప్తావరణంబులు ని
క్షిప్తములగుచును శరీర కేదారములో
గుప్తముగ కప్పెజ్యోతిని
ఆప్తునివలె సహకరించుమాత్మకు మనసా ! 69.

సప్తావరణములు: 1) దుఃఖము, 2) జన్మము, 3) కర్మము 4) అభిమానము, 5) అవివేకము, 6) అజ్ఞానము, 7) మాయ, ఇవి శరీర సంబంధమైనవి. ప్రకృతి పరముగా 7 ఆవరణములు 1) పృథివి, 2) జలము, 3) అగ్ని 4) వాయువు, 5) ఆకాశము, 6) అహంకారము, 7) మహత్తత్త్వము; నిక్షిప్తము = దాగియుండునది; కేదారము = వరిమడి; గుప్తము = రహస్యము; ఆప్తుడు = విశ్వసనీయపురుషుడు (మిత్రుడు)

కం॥ కాలకు తాపత్రయ శిఖి
గూలకు సంసార ఘోర కూపమునందున్
వ్రాలకు బాహ్యజగత్తున
కాలునివల బడకుమీవు కైపున మనసా! 70.

తాపత్రయము:- 1) ఆధ్యాత్మిక తాపము, 2) ఆధిభౌతిక తాపము, ఆధిదైవిక తాపము. శిఖి = అగ్ని; కూపము = నుయ్యి; వ్రాలకు = వాలకు; బాహ్యజగత్తు = బయటి ప్రపంచము; కైపు = విజృంభణ లేక మద్యము త్రాగుటవలన కలుగుమత్తు.

కం॥ సోమరితనము త్యజించుము
నామామృత పానమందు నడయాడుమిలన్
కామాగ్ని బడకు రాధా
స్వామిచరణసంగమందు సాగుము మనసా ! 71.

త్యజించుము = విడువుము; చరణము = పాదము; సంగము = కూడుట.

కం॥ ఇడ పింగళనాడులు రెం
డెడబాయక ప్రాణవాయువిచ్చి విడువగా
నడుతువు సుషుమ్నానాడిన్
వడి జూడగ సర్వసాక్షి వారక మనసా! 72.

కం॥ నామోపదేశమొసగెను
బాములు భస్మంబు జేయ బంధము త్రెంచన్
కామాదులెల్ల నెట్టగ
మామక సద్గురు వరుండు మరువకు మనసా! 73.

నామోపదేశము = గురుసంధితమంత్రము; బాములు = దుఃఖములు; భస్మము = బూడిద; మామక = నాయొక్క.

కం॥ నిను జేరుటచే మరచెను
జననస్థానమును శక్తిసామర్థ్యంబుల్
తన నిజరూపము దెలిసిన
వినదాత్మ భవద్వచనము విహ్వల మనసా! 74.

భవత్ + వచనము = నీమాట; విహ్వలము = భయాదులచేత అవయవములు స్వాధీనము తప్పుట.

కం॥ అనుభవవేదాంతము స
జ్జనులకమృతతుల్యమౌను జ్ఞానంబబ్బున్
తనుదా దెలియని వేదాం
తనిష్ఠ మృగతృష్ణగాదె తక్కరి మనసా! 75

తుల్యము = సమానము; మృగతృష్ణ = ఎండమావి.

కం॥ భార్యాపుత్రులు బంధువు
లార్యులు జననీజనకులునాప్తులు రారే
నిర్యాణవేళ వెంబడి
పర్యాలోచనముసేయ బంధమె మనసా! 76.

నిర్యాణము = చావు; పర్యాలోచనము = చక్కగాఆలోచించుట.

కం॥ గురుశుశ్రూషలు భువి నా
ల్గరయగ స్థానాంగ భావనాత్మలనంగా
నిరతము తత్సేవాత
త్పరవై దేశికుని గొల్చి తనరుము మనసా! 77.

శుశ్రూష = సేవ; తత్పరత = ఆసక్తి కలిగియుండుట; దేశికుడు = గురువు; తనరు = ప్రకాశించు;

కం॥ చంచలవు నాభినుండగ
కించి ద్ధృదయమున నున్న కేళిన్ మనవే!
మించి గళమీవు చేరిన
కాంచును జీవుడు కలలు వికారపు మనసా! 78.

చంచలవు =నిలకడలేనిదానవు; నాభి= బొడ్డు; కించిత్= కొంచెము కేళి = ప్రియునితోడి విహారమునందలి నాయికయొక్క క్రీడ; మనుట = ఉండుట; గళము = కంఠము; ఈవు = నీవు.

కం॥ లోపలి సౌందర్యము, ఈ
తాపములను చల్లబరచు ధైర్యమొసంగున్
ఏపుగ కనుబొమల నడుమ
రాపడి నిలువగ గురుండు ప్రాపగు మనసా! 79.

సౌందర్యము = చక్కదనము; రాపడి = దృఢపడి;

కం॥ విడువుమసూయాద్వేషము
లుడుగుము పరనిందనుడుగుమోలిమి లేమిన్
అడుగుల పైబడి వేడిన
కడు దయతోగాచు గురుడు కదియవె మనసా! 80.

అసూయ = గుణములందు దోషమునారోపించుట; ద్వేషము = శత్రుత్వము; కదియుట = దగ్గరవచ్చుట.

కం॥ మనసే బ్రహ్మయు, విష్ణువు
మనసే పరమేశ్వరుండు మనసే సురలున్
మనసే రాక్షసులరయగ
నని తాత్త్వికవర్యులనుట యరయవె మనసా ! 81.

సురలు = దేవతలు; తాత్త్వికవర్యులు = తత్త్వము తెలిసినశ్రేష్ఠులు
తత్ = ఆపరమాత్ముడు; త్వం = నీవు.

కం॥ తమి మనసాత్మను కలయు వి
ధము యోగంబగును సాంఖ్యతారకములు పై
నమనస్కములన యోగము
లమరగ మూడంచు జ్ఞానులనిరే మనసా ! 82.

తమి = ఆపేక్ష; యోగములు ముఖ్యముగా మూడు 1) సాంఖ్యము
2) తారకము 3) అమనస్కము; యోగము = కలయిక.

కం॥ మంతనమింద్రియములతో
నంతముగావించి నియతినాత్మకు తోడై
అంతర్జ్యోతినీ కని రా
ద్ధాంతముడిగి చేరుము గురుధామము మనసా ! 83.

మంతనము = ఆలోచన; నియతి = నియమము; ధామము= చోటు

కం॥ నామస్మరణము, ధ్యానము
కామనముల కాల్చివేసి కైవల్యమిడున్
నామామృతమాధారము
నేమపు ధ్యానంబె గురువు నీకగు మనసా ! 84.

కామనము = కోరిక; కైవల్యము = మోక్షము.

కం॥ ధ్వన్యాత్మక మంత్రమె కడు
మాన్యము సంతుమతమునకు మాయను గెలువన్
అన్యోపదేశమంత్రము
లన్య భవాంబుధిని ముంచు నాత్మను మనసా! 85.

ధ్వని + ఆత్మకము = శబ్దముతో కూడినది; కడు = మిక్కిలి; మాన్యము = మన్నింపదగినది; అన్యోపదేశమంత్రము = ఇతర మంత్రోపదేశములు; భవాంబుధి = పుట్టుకలకడలి.

కం॥ వర్ణాత్మక మంత్రంబుల
కర్ణంబుల వినినయంత కలినింకునోకో!
అర్ణవ సమాన కర్మలు
నిర్ణయనిర్వాణమబ్బునే?. కను మనసా! 86.

వర్ణాత్మకమంత్రము = అక్షరములతో కూడిన మంత్రము; కర్ణము = చెవి; అర్ణవము = సముద్రము; నిర్వాణము = ముక్తి.

కం॥ వినవలెను "సురత శబ్దము"
కనవలె "నిరతము"ను జ్యోతి కమనీయముగా
చనవలె సత్ లోకమునకు
జనన మరణ భయములెల్ల సమయగ మనసా! 87.

సురత శబ్దము = చెవితో వినెడు అనాహత శబ్దము; నిరతము = సంతుమత సిద్ధాంతము ప్రకారము మూడవకంటితో జూచుకాంతి; కమనీయము = మనోహరము, ఇంపైనది; సమయుట = నమసి పోవుట.

కం॥ మతముల మత్తున పడకుము
పతితవు కాకుము రిరంస పంకములోనన్
మతిదప్పి కులపువలలో
చతికిలబడి చిక్కబోకు జగతిన్ మనసా! 88.

పతిత = చెడిపోయిన స్త్రీ; రిరంస = రమించవలెనను కోరిక; పంకము = బురద; మతి = బుద్ధి.

కం॥ ముప్పొరలు గాగనాత్మకు
కప్పబడియె స్థూలసూక్ష్మకారణతనువుల్
గొప్ప గురు కరుణ వానిని
తప్పించిన ముక్తి బొందదగునో మనసా! 89

మూడు + పొరలు = మూడుమడతలు; శరీరత్రయము :- 1) స్థూల శరీరము, 2) సూక్ష్మశరీరము, 3) కారణ శరీరము.

కం॥ సాగర నదీనదంబుల
చాగిలబడి స్నానమాడ సద్గతి కలదే
జాగరమేకాదశులిల
సాగించిన ముక్తిబొంద సాధ్యమె మనసా! 90.

సాగరము = సముద్రము; నది = పడమట పుట్టి తూర్పుగా ప్రవహించునది; నదము = తూర్పుగా పుట్టి పశ్చిమముగా ప్రవహించు నది; జాగరము = రాత్రిమేలుకొనుట; ఏకాదశి = తిథులలో 11వది.

కం॥ శమదమములును తితిక్షయు
నమలోపరతియును శ్రద్ధయ సమాధానం
బు మహిస్థలి షట్కర్మలు
తమిజేసి నివృత్తి బొంది తనరుము మనసా! 91.

శమము = అంతరింద్రియనిగ్రహము; దమము = బహిరింద్రియ నిగ్రహము; తితిక్ష = ఓర్పు; అమలము = నిర్మలమైనది; ఉపరతి మనస్సును ఆత్మతో కలిపి, అట్టిఆత్మను దేవునితో జేర్చుట; శ్రద్ధ = ఆసక్తి; సమాధానము = అంగీకారము; నివృత్తి = విడుదల.

కం॥ గురుడొసగె పంచనామము
లెఱుకను కల్గించి మోక్షమిచ్చుట కొరకై
అరమర లేక జపించుము
స్థిర సత్‌లోకమునఁనాత్మ చెలగగ మనసా! 92

పంచనామములు = సంతుమత సిద్ధాంతము ప్రకారము గురుమంత్రము; ఎఱుక = జ్ఞానము; అరమర = సందేహము; చెలగు = సంతోషించు

కం॥ సత్యపురుషుడలకుపురుషు
డత్యంతానంద మొసగు నాగమపురుషుం
డత్యుత్తమ లోకంబులు
సత్యాలాకాగమముల స్వాములు మనసా ! 102.

అత్యంతానందము = ఎక్కువ సంతోషము; అత్యుత్తమము = చాల శ్రేష్ఠము;

కం॥ గురువరుడనామి నుండియె
అరుదెంచి గురూపదేశమాస్తికులకిడెన్
గురువొకడె తోడురాగల
డురుసుఖమాలోకమందు నొసగగ మనసా ! 103.

ఆస్తికుడు = దేవుడు కలడని నమ్మువాడు; ఉరుసుఖము = శ్రేష్ఠ సుఖము.

కం॥ సంతుమహాత్ముల మార్గము
వింతైకచ్చట్టు తత్త్వవేత్తలకైనన్
రంతులు మాని పరీక్షగ
కాంతుల వీక్షించి ముక్తిగాంచుము మనసా ! 104.

రంతులు = క్రీడలు;

కం॥ మోక్షపథంబులు నాలుగు
పక్షి, ఝష, పిపీలి, తంతువాయ పథంబుల్
సాక్షాత్ సత్యపురుషుని ని
రక్షరునాత్రోవలందు నరయము మనసా ! 105.

పథము = మార్గము; మోక్షమార్గములు నాలుగు: 1) పక్షిమాదిరిగా వెళ్ళి పరలోకమను చెట్టుపైనున్న ముక్తిఫలమును భుజించుట; 2) ఝషము (చేప) మాదిరిగా నూతనజల స్థానమను ముక్తినిబొందుట; 4) పిపీలి. (చీమ) పరలోక వృక్షఫలరసము నాస్వాదించుట, 4) సాలెపురుగు తనదేహమునుండి తయారుచేసిన సాలెగూడునెగబ్రాకి నట్లుఎగబ్రాకి మోక్షస్థానము చేరుట; నిరక్షరుడు = అక్షరములు కూడ లేనివాడు.

కం॥ అకరహితదంపతులయి న
యకర్మ బేర్గన్న సాకమాంబకు సిద్ద
ప్పకు సుతుడగు సిద్ధేశ్వర
ము కొల్లపాఖ్యుడు రచించె పాత్తము మనసా ! 106.

అకరహితము = పాపములేకుండుట; దంపతులు = ఆలుమగలు: సుతుడు = కొడుకు; ఆఖ్యుడు = పేరుగలవాడు; పాత్తము = పుస్తకము (గ్రంథము).

కం॥ అజ్ఞానము తొలగించును
జిజ్ఞాసువులకమృతంబు చిందించునెదన్
సుజ్ఞానులకాభరణము
ప్రజ్ఞామయరచనమిద్ది పండిన మనసా ! 107.

అజ్ఞానము =తెలియనితనము; జిజ్ఞాసువు = తెలియనిచ్ఛ గలవాడు; సుజ్ఞాని = మంచి యెఱుక గలవాడు; ఆభరణము = భూషణము; ప్రజ్ఞామయము = బుద్ధితోకూడిన.

కం॥ మంగళము గురువరేణ్య !
మంగళమోసత్యరూప ! మాయాతీతా !
మంగళము ప్రేమనాథా !
మంగళమని పాడుకొనుచు మలగుము మనసా ! 108.

"ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః"

—: సమాప్తం :—

# కృతజ్ఞతలు

నాకు మంత్రోపదేశము చేసిన సత్యలోకవాసి సద్గురు బాబా ప్రేమనాథమహారాజులు మనసాశతకమును చూచి, తన సతీమణి పుష్పమ్మగారి చేతను, హత్తిబెళగల్లు రామలింగమ్మగారిచేతను పరిశీలింపజేసి అచ్చువేయుటకు అనుమతించిన మద్గురునకు నామనఃపూర్వక సహస్రాధికసాష్టాంగ ప్రణామములు చేసి, అట్లులే మాత పుష్పమ్మగారికి, సోదరి రామలింగమ్మగారికి నా కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను.

ప్రస్తుత పీఠాధిపతులు సద్గురు వాసుదేవాచార్య మహారాజులు నేను ప్రార్థించినదే తడవుగా తన అమూల్యమైన అభిప్రాయమును పంపి నన్ను ఆశీర్వదించినందుకు నా హృత్పూర్వకసాష్టాంగప్రణామములు చేయుచున్నాను.

గ్రంథమును పరిష్కరించుటలో తన సహాయసహకారము లందించి మెలకువలు తెలిపిన 'కవిరత్న' శ్రీ దాదనచిన్నయ్యగారికి నా హృదయ పూర్వకకృతజ్ఞతలు.

అడిగిన వెంటనే తమ అమూల్య అభిప్రాయములనంపించిన శ్రీశలాక రఘునాథశర్మగారికి, శ్రీదాదన చిన్నయ్యగారికి, శ్రీ నంకరాజుకాల్వ వీరభద్రాచార్యులు గారికి, ఆధ్యాత్మికవేత్త శ్రీనెట్టెప్పగారికి, ఈ చిఱు పొత్తమునకు ఆర్థికసహాయమందించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి, అందముగా అచ్చువేసి సకాలములో అందించిన శ్రీ గాయత్రీ ప్రెస్ వారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు. కృతజ్ఞతలు.

గుంతకల్లు, రచయిత

20-3-2000. సిద్ధేశ్వరం కొల్లప్ప

---

# కవి పరిచయము

అనంతసువిశాలసుందరకవితోద్యానవనమున పుష్పించి గుబాళించిన కావ్యసుమాలెన్నో ఎన్నెన్నో. అటువంటి వానిలో కవితా భారతి బిరుదాంకితులయిన శ్రీ సిద్ధేశ్వరం కొల్లప్పకవిగారి కలంబు నుండి జాలువారిన కవితాసుమాలలో మనసా శతకం ఒకటి.

వీరు రెండవ ప్రపంచయుద్ధకాలంలో అనంతపురం జిల్లా రాయదుర్గం తా॥ టి. వీరాపురంలో నిరుపేదలు నిరక్షరాస్యులు అయిన కీ॥శే॥ సాకమ్మ సిద్ధప్పలను పుణ్యదంపతులకు జన్మించిరి. చిఱుప్రాయముననే విద్యాభ్యాసమునకై అఱ్ఱులు సాచిన వీరు ప్రాథమిక విద్యను తన స్వగ్రామముననే సాగించి 1950 నుండి 1954 వరకు రాయదుర్గం హైస్కూలులో 6వ తరగతి నుండి 9వ తరగతి వరకు చదివి అతి

దుర్భరమైన కుటుంబదారిద్ర్యపరిస్థితికి తలయొగ్గి కుటుంబపోషణార్థము ప్రైవేటు టీచర్‌గా ట్యూషనులు చెప్పకొనుచు జీవనం సాగించినారు. చాలీచాలని ఆదాయానికి విసిగి 1963వ సం॥ బెంగుళూరు వెళ్ళి 1965వ సం॥ దాకా ఫ్యాక్టరీలో పనిచేసిరి. దైవానుగ్రహమున వారి కష్టాలు గట్టెక్కేకాలం సమీపించడంతో 1965వ సంవత్సరములో పోస్టల్ డిపార్టుమెంటుఉద్యోగంలో ప్రవేశించి మెలమెల్లగా కుటుంబమును దారిద్ర్యరేఖ నుండి దూరంగానెట్టివేయగల్గి చక్కని కుటుంబపోషణతో, సలక్షణసంతానముతో సుఖజీవనులై 1997వ సం॥ జూన్ 30వ తేదీన ఉద్యోగవిరమణచేసి ప్రస్తుతము విశ్రాంతజీవితం గడుపుచున్నారు.

జీవితం తొలిదశలో ఎన్నో ఆర్థికపరమైన ఒడుదుడుకులకు గురియైనప్పటికి ఎంతో నిబ్బరం ప్రదర్శించిన శ్రీకొల్లప్పగారికి సరస్వతీ మతల్లికా కరుణాకటాక్షములభించినది. బురదలోపుట్టినప్పటికిపువ్వు తన గుబాళింపును వీడదన్నట్లు కవిగారు చిన్ననాటనే తన కవితాసౌరభాలను వెదజల్ల నారంభించినారనుటలో అతిశయోక్తి కానరాదు. బాల్యంలోనే మహాగ్రంథాలందలి పద్యాలను కంఠస్థం గావించి వాటినిమరలా అలవోకగా చెప్పగల్గేవారు. అట్లు పద్యాలమీద మక్కువఎక్కువై 7వ తరగతి నుండే ఛందోబద్ధంగా కవిత్వం అల్లగల్గడం అలవాటుచేసికొని తనకవితా క్షేత్రమున ఎన్నోకమ్మని శతక కావ్యఫలాలను అందివ్వడానికి నాందిగా 16వ ఏట శ్రీరంగశతకంవ్రాసిరి. పిదప 1976లో సరస్వతీశతకం, 1977లో సిద్ధేశ్వరశతకం, 1994లో మనసాశతకంవ్రాసిరి వీరి మనసా శతకానికి తిరుమల తిరుపతిదేవస్థానంవారి ఆర్థికసహాయము, సద్గురు శతకానికి హైదరాబాదు తెలుగు విశ్వవిద్యాలయమువారి ఆర్థికసహాయం లభించింది.

వీరిశతకములు పరిశీలింపగా వారి కవితాపాటవము పాఠకులకు అవగతమవుతుంది. వీరు అలతి అలతిపదాలతోగాని, సుదీర్ఘసమాసాలతోగాని, పద్యాలను వ్రాయగల్గుటలో అందెవేసిన చేయి.

వీరు కవితావ్యాసంగముననే కాక సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొని కార్యక్రమములను చక్కగా నడుపగల్గడంలో మేటి. వీరు పదోన్నతిపై వెళ్ళిన తరువాత మెదక్‌లో "మంజీర సాహితీ సమితి"ని స్థాపించి కార్యదర్శిగావుండి ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలను నిర్విఘ్నముగా సాగించి అనేక సన్మానములను పొందినారు. గుంతకల్లులో స్థాపించబడిన 'శ్రీ భారతీ సాహితీ సమితి'లో కూడ చేరి దాని అభివృద్ధికై తనవంతు కృషినందించినారు. వీరు చిన్ననాటి నుండియే కన్నడ బైలు